గోపాలకృష్ణయ్య, కోగంటి

సిమ్లా భాగవతం

బెజవాడ, 1946

Record no. 116

Gōpālakṛṣṇayya, Kōgaṇṭi

Simlā bhāgavataṃ

Bejavāḍa, 1946

Record no. 116

Bibliographic Record Target

గోపాలకృష్ణయ్య, కోగంటి.
సిమ్లా భాగవతం : వీధి నాటకం / రచన కోగంటి గోపాలకృష్ణయ్య. - బెజవాడ : ప్రజాశక్తి ప్రచురణాలయం, 1946.
(2), 24 p. ;17 cm.
Record no. 116

Gōpālakṛṣṇayya, Kōgaṇṭi.
Simlā bhāgavataṃ (vīdhi nāṭakaṃ) / racana Kōgaṇṭi Gōpālakṛṣṇayya. - Bejavāḍa : Prajāśakti Pracuraṇālayaṃ, 1946.
(2), 24 p. ;17 cm.
Record no. 116



# సిమ్లా భాగవతం

(వీధి నాటకం)

●

ప్రజాశక్తి ప్రచురణాలయం : బెజవాడ

# సిమ్లా భాగవతం

(వీధి నాటకం)



రచన:

కోగంటి గోపాలకృష్ణయ్య

ప్రజాశక్తి ప్రచురణాలయం

బెజవాడ

ప్రచురణ నెం. 192

ప్ర.సం. 2

వెల రు. 0—4—0




...శక్తి ప్రెస్ - బెజవాడ
క. 13/సి.—3000—1-1-46.

# పాత్రలు

| | | | |
|---|---|---|---|
| 1. | క్రిప్సు | .... | ఆంగ్ల వాణిజ్య శాఖాధిపతి; రాయబారవర్గ సభ్యుడు |
| 2. | లారెన్సు | .... | ఇండియా మంత్రి; ,, |
| 3. | అలగ్జాండర్ | .... | నౌకా శాఖామంత్రి; ,, |
| 4. | వేవెలు | .... | వైస్రాయి |
| 5. | సర్దార్ పటేలు | | కాంగ్రెసు నాయకులు, పార్లమెంటరీబోర్డు అధ్యక్షులు |
| 6. | జవ్హారీలాల్ నెహ్రూ | | కాంగ్రెస్ సభాపతి |
| 7. | జనాబ్ జిన్నా. | | లీగు అధ్యక్షులు |
| 8. | పి. సి. జోషి | | భారత కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి |
| 9. | నవాబ్ భోపాల్ | | సంస్థాన సభాధ్యక్షుడు |
| 10. | పత్రికా విలేఖర్లు | | |



# పరిచయం

తెలుగునేట ప్రచారంలో వున్న ప్రాచీన కళలను పునరుద్ధరించ డానికి ఆంధ్ర ప్రజానాట్యమండలి కృషిచేస్తూంది. బుర్రకథలు, భజనలు, సమిష్టినృత్యాలు, హరికథలు, జముకుల కథలు, వీధిభాగవతాలు వగైరా ప్రదర్శించుతూంది. ప్రజాసమస్యలకు సంబంధించిన నూతన యితివృత్తా లను తీసికొని ప్రాచీన కళారూపాలలో చిత్రించి ప్రజల విజ్ఞానాభివృద్ధికి పాటుబడుతూంది.

'సిమ్లా నాటకము' అనే యీ వీధిభాగవతాన్ని కోగంటి గోపాల కృష్ణయ్యగారు రచించారు. ఇదివరకు వీరే 'హిట్లరు పరాభవం' అనే పేరుతో రెండవ ప్రపంచ యుద్ధాన్ని వీధిభాగవతంగా చిత్రించారు. దానిని లక్షలకొలదీ ప్రజలు చూచి ఆనందించారు. రచయితను అభినం దించారు. ఇది గోపాలకృష్ణయ్యగారి రెండో వీధినాటకం. ఇదికూడా ప్రజల మెప్పును పొందుతుందని ఆశించుతాము.

రచయిత దీనిని రచించడంలోనూ ప్రజానాట్యమండలి ఈ కళా రూపాన్ని నేర్చుకోడంలోనూ, కూచిపూడి వాస్తవ్యులు దర్భా వెంక టేశ్వర్లుగారు సహాయంచేశారు. వారికి రచయిత తరఫున, నాట్యమండలి తరఫున, ప్రకాశకుల తరఫున అభివందనాలు అర్పించుతున్నాను.

—చంద్రం.

# "సిమ్లా నాటకం"

## (వీధి భాగవతం)

## ప్రార్థన

**ఆటతాళం - కాంభోజిరాగం**

అంబా పరాకు - దేవీ పరాకు
మమ్మేలు మా భారతాంబా పరాకు॥
బానిసదేశముక్తి - స్వాతంత్ర్య దీక్ష
కల్గించే - ఓ కల్పవల్లీ పరాకు॥
దేశసేవనె - ఉగ్గుపాలతో నేర్పియు
ఖ్యాతి గాంచిన భరతమాతా పరాకు॥
దాస్య శృంఖముల - అంబ
తెగద్రెంచియును - అంబ
స్వర్ణ చరిత్రను - అంబ
నిర్మించెదమో యంబ॥ భరతాంబ॥

సూత్ర : అని యీ ప్రకారంబున, భారతదేశ భాగవతంబున ద్వితీయ స్కంధంబున "సిమ్లా నాటకం"బునకు కథాక్రమం బెట్టిదనిన—

సేవ : భారతీయులారా ! ప్రభుభక్తి పరాయణులారా ! మారణ మహా హోమంబులో తృణప్రాయంబుగా ప్రాణంబు లర్పించు త్యాగ మూర్తులారా ! అఖండ భారత భూవలయంబును ఏకచ్ఛత్రాధి పత్యము క్రింద పాలించుచున్న 'వేవెలు' ప్రభువు సిమ్లా భవనం బునకు విచ్చేసి యున్నాడని దెల్ప వచ్చియున్న వాడ. కావున సభికులెల్లరు సందడిచేయక జాగరూకులై యుండ కోరుచున్న వాడను—

[ వేవెలు ప్రవేశం ]

ఆదితాళం - సావేరిరాగము - చతురశ్రగతి

లార్డు వేవెలును చూడరె - భారతీయు లిపుడీ॥
సంగర రంగంబున కోల్పోయిన
ఒంటి కన్నుతో, కుంటి కాలుతో ॥లా॥
ఢిల్లీలో దర్బారు దీర్చెడి
అమాత్యత్రయముకు, హారతులిచ్చెడి ॥లా॥

సేవ : ప్రజాపీడనాశయా! వేవెలు మహాశయా - పరాక్

వేవె : సెహబాష్.... ప్రపంచపీడిత ప్రజాకోటికి పెన్నిధియును, నలుబది కోట్ల భారతీయులకు ఆపద్బాంధవుండును, ఆడితప్పని సత్య సంధుండును, దీక్షా దక్షుండునూ——

సేవ : మైనారిటీల ఆటంకంబు లెక్కసేయక, మెజారిటీలమాట నెగ్గించ ప్రతిన దాల్చిన ఉత్తర కుమారాట్టహాస ప్రజ్ఞాధురీణుండునూ - బట్ట తలకు నిలయుండునూ, చుట్టలచర్చిలుకు చెలికాడునూ——

వేవె : అగు. "ఆట్లీ నామధేయంబుకలవాని ఆనతిని అరుదెంచిన, అమాత్యత్రయంబదె వచ్చుచున్నారని దెప్పవచ్చియున్నవాడను. సంపూర్ణ స్వాతంత్ర్య కాంక్షులైన భారతీయులు సందేహించక, వందన శతంబులతో ఆహ్వానింపుడు.... ఒరే సేవకా! హజారము నందు జాగ్రత్తగాయుండుము (నిష్క్రమించును)

[ లారెన్సు ప్రవేశం ]

ఆదితాళం—సావేరిరాగం చతురశ్రగతి

వెడలె - లారెన్సు - సభకూ - స్వాతంత్ర్యదాతయై ॥వె॥
బైబిలు చంకన - ప్లానొకవంకన
వంకికర్ర బింకముగ త్రిప్పుచును ॥వె॥
అమెరికన్నను - అధిక్యుడనని
భావిచరితలో ప్రజలుమెత్తురని ॥వె॥

సేవ : అపర దధీచీ! ఆషాడభూతీ! వృద్ధజంబుకాగ్రేసర చక్రవర్తీ-బహు పరాక్.



లారె. సెహబాష్. ఓరీసేవకా! కార్యవర్గ మంత్రిపుంగవులగు మహ్మదు స్మాన్, రామస్వామి మొదలియార్లునూ, స్వామి భక్తిపరాయణు లగు సంస్థానాధీశ్వరులునూ, జాతీయోద్యమబోర్డు తలక్రిందులొ నర్చి, భారతదేశ గార్డియన్ అని గుడ్ నేమ్ పొందిన వేవెలు విచ్చేసి యున్నవారలా?

సేవ : విచ్చేసియున్నారు మంత్రిపుంగవా!

మరోసేవ : భవదీయ మిత్రులు, రాజభక్తులు, రాయబార సంజయులలో ముఖ్యులు క్రిప్సు మహాశయులు రాజప్రతినిధి భవనంబునకు రానున్నారు సచివోత్తమా!

లారె : ఆహ్వానింపుడు.

[ క్రిప్సు ప్రవేశం ]

ఆదితాళం - కాంభోజరాగం

స్టాఫర్డు క్రిప్సునే - సోషలిస్టును నే
రవి యస్తమించనట్టి రాజ్య మేలించువాడ ॥స్టా॥
ఆస్ట్రేలియాఫ్రికాన్ - అంతులేని ఇండియాన్
పాలించె జాతిలోన - కాలాంతకుండనే ॥స్టా॥
రష్యదేశంబునకు - రాయబార మేగివచ్చి
భారతీయులకు స్వాతంత్ర్య (తంత్ర) దానంబునిచ్చే ॥స్టా॥

సేవ : కుటిలచరితా! రాయబారసంజయా! క్రిప్సుమహాశయా! జోహార్

క్రిప్సు : సెహబాష్.

లారె : హల్లో! అనుంగు సోదరుడు అలగ్జాండ రెక్కడ?

క్రిప్సు : కరాచీ విమానాశ్రయంబున కాలుమోపినంతనే వాణిజ్యమండలి ప్రతినిధులు, పరిశ్రమల పెట్టుబడిదార్లు వెంబడించిరని రాయిటరు విలేఖరివలన తెలుసుకొంటిని. వ్యాపారఒడంబడికలు, స్వంత పనులు తరువాయి చూచుకోవచ్చునని కబురంపియే యుంటిని.

సేవ : అల్లదె మంత్రిమహాశయు లరుదెంచుచున్నవారు మహాశయా!

[ అలెగ్జాండరు ప్రవేశం ]

**ఆదితాళం — పూరికల్యాణీ రాగం**

అరుగుదెంచెనూ - ఆంగ్లదేశమునుండి ఏ. వి. అలగ్జాండరు ॥అరు॥
నౌకశాఖనాయకుడు, ధనికులెల్లరకు గురుడు
ఆంగ్లప్రభులలో ఘనుడు - అతిరథుడు, మహారథుడు ॥అరు॥
దండిబలంబెంతో - అండగానుండంగ
మొండిధైర్యముచేసి - పీడితుల చెండాడ ॥అరు॥

సేవ : మదగజరాజాననా! మౌనవ్రతవిలీనా - బహుపరాక్.

అలె : మాంచిది.

సేవ : (మంత్రిత్రయముతో) కేపిటలిస్టు ఆశయా! మంత్రిత్రయా!
కపటనటకత్రయా - బహుపరాక్.

అందరు : సెహబాష్.

ఆదితాళం — సావేరి రాగం

దౌత్యసరళి - అమాత్యత్రయంబిదె
కీర్తిగలుగ పెసలుపెలుగ, మురమున
కొలువైయుండిరీ సభలో, భారతపథకంబుతో ॥కొ॥
నీటుగాను సూటు బూటువేసియు 'నెక్కు టయి'ని గట్టి -
శాగ్జను ఫిటింగు, సాఫు కటింగుతో, కోటి సూర్యప్రభతో -
సామ్యవాదమును కూలద్రోతు మను - సంతసంబు మీరా -
ప్రభులకు — సాటిరారు, రాయబారు లెవరని
ధాటి జూప వాయువేగ గతితో
కొలువై యుండి రీ సభలో॥ ॥భార॥

వేవె : (ప్రవేశించి) ఫస్టులార్డు ఆఫ్ ఎడ్మిరాలిటీ! గుడ్‌మార్నింగ్.

సూత్ర : అని. యీ ప్రకారంబున అమాత్యత్రయంబు ఢిల్లీ నగరంబున, వేవెలు భవనంబున నిండుకొలువై యున్న సమయంబున, సమస్త పత్రికా విలేఖర సంజయుల సమక్షంబున స్టాఫర్డు క్రిప్సు తమ పరిచయవిధానంబు సాగించిన కథాక్రమం బెట్టిదనిన—



క్రిప్స : భారతావని నెల్ల పాలించు లారెన్సు
చల్లని కృపజూచు తెల్ల ప్రభువు
సప్త సముద్రాల సంచరించెడి నౌక
కధినేతయౌ అలగ్జాండ రితడు
రవి యస్తమించని రాజ్యంబు నిల్పగా
వేగుచుక్కయి నిల్చు వేవె లితడు
పాచికల్ వేయగా ప్రజ్ఞా ధురీణుడౌ
వాణిజ్య శాఖాధి పతిని 'నేను'
భారతీయుల కలహముల్ బాపు కొరకు
ఇచ్చవచ్చిన రాజ్యాంగ మిచ్చు కొరకు
సరసమగురీతి నేతల సంప్రదించ
వచ్చితిమి దేశ వాసులు మెచ్చగాను.

మార్చి పదునైదవతేదీ - పార్లమెంటు సమావేశంబున 'అట్లీ ప్రకటన స్పష్టంబేకదా! అదియే భారత స్వాతంత్ర్య సూత్రమున కాధారమౌ నాంది. సంప్రదింపులు సఫలమగుటకే సర్వదా యత్నించెదము. అయిననూ - అధికారంబెవరి పరంబుచేయవల యునాయని చిత్తంబు ఉత్తలంపడుచున్నది - వెన్వెంటనే వివిధ పార్టీ నాయకులతో సంప్రదింపులు జరుపుటయే ప్రథమ కర్తవ్యము. నేడే ఉపక్రమించెదము.

విలేఖ : అటులనే కానిండు. 'స్వాతివానకు ముత్యపు చిప్పలకైవడి తమ దిన దిన ప్రకటనలకెదురు చూచుచుందెదము. సెలవా?

క్రిప్స : (చిరునవ్వుతో) మంచిది.

(విలేఖరులు నిష్క్రమింతురు)

లార్సె : (వేవెలు పంకజూచి) కాంగ్రెసు నాయకులకు ఆహ్వానములు పంపితిరిగదా, సమాధానము?

వేవె : సంప్రదింపులకు వచ్చుచున్నారని వార్తవచ్చింది.

••••○○○••••

# 2వ రంగం

[పటేలు - నెహ్రూ ప్రవేశం]

ఆదితాళం - అఠాణారాగం

కొలువు కూటము జేరెనపుడూ
గుజరాతి సర్దార్ ॥కొ॥
గాంధీజీ యాశీస్సులందుకొని
కాంగ్రెసు రథమును నడుపుసారథై ॥కొ॥
పటుతరమైన శక్తిజూపి - స్వాతంత్ర్యవాంఛను
చాటు జవ్హారిలాల్ వెంటరాగ
విజయసాధనకు అజాదానతిని
జాతీయ సంస్థకు ఖ్యాతిగూర్చగా ॥కొ॥

వేవె: భారత కాంగ్రెసు అధినేతలారా!

క్రిప్సు: స్వాతంత్ర్య యోధులారా!

లారె: దయచేయుడు .... (లారెన్సు - వల్లభాయి, పరస్పర వందనములు చేసుకొందురు. నెహ్రూ - క్రిప్సు కరస్పర్శ చేయుదురు. వేవెలు, ఆసనంబులు చూపగా - నెహ్రూ, పటేలు ఆసీనులగుదురు)

లారె: — కందార్థం —

పదునైదవ మార్చిఘటన
పదిలముగా జూచి తాము పర్యవసానం
బిదియని తేల్చుకొనంగా
ముదముగ చర్చింపుడిపుడు ముందీప్లానున్
సదమలకీర్తిగాంచ యీజగతిన్

శాశ్వతంబగు పరిష్కారము, చేయుసంకల్పంబు మాయది
దేశపాలన నేటితోయిక భారతీయుల హస్తగతమౌ
సందేహమేలా? స్వాతంత్ర్యసిద్ధి పొందెడివేళ॥

నెహ్రూ: వర్కింగుకమిటీ అభిప్రాయమును రాష్ట్రపతి 'మౌలానా ముచ్చటించెనుకదా! భారతదేశ స్వాతంత్ర్యమే మాముఖ్య ఆశయం.



క్రిప్సు: (ముసిముసి నవ్వుతో) అవును పండిట్‌జీ. అధికారము భారతీయుల హస్తగతముజేయ సంకల్పించియే యింతప్రయాస. ప్రధానరాజకీయపార్టీల అంగీకారంబుతో నూతనరాజ్యాంగ చట్టము ను తయారుచేయుట మాకుసమ్మతంబు.

పటే: హృదయపూర్వకముగా ఒడంబడిక చేసికొనగోరుటే మీకోరిక. యని 'బాపుజీ' వలనతెలుసుకొంటిమి. అయినను దేశవిభజనను గురించి జిన్నాప్రకటన జూచితిరిగదా! పాడిఆవును ముక్కలు ముక్కలుగా తరిగినట్లు భారతదేశమును విభాగించదానికికాంగ్రెసు అంగీకరించదు.

గీ॥ రెండుజాతుల సిద్ధాంత ముండతగదు.
రెండురాజ్యాంగ సభ లెపుడుండరాదు.
ఒక్క కేంద్రంబె దేశాన ఉండవలయు
ఇదియె రాజీకి మార్గమం చెంచవలయు.

మొన్న యెన్నికల్లో కాంగ్రెసు సంస్థకు అఖండ విజయంబు చేకూరుట మీ రెరుంగకపోరు. అధికారము భారతీయుల హస్తగతము జేయుటే కర్తవ్యమని యెంచిన తదనుగుణ్యంబుగా వర్తించు టుచితము.

వేవె: సర్దార్! జనరల్ నియోకజవర్గములలో 'కాంగ్రెసు', ముస్లిం నియోజకవర్గములలో 'లీగు' జయించిన వార్త మంత్రిపుంగవు లెరుంగకపోరు.

లారె: అందుచేత ప్రధాన రాచకీయపక్షంబులతో సన్నిహిత సంప్రదింపులు జరుపుడని సార్వభౌమ ప్రభుత్వము తరపున ప్రధానామాత్యుడు రాయబారంబులకు మమ్ముల నియోగించె.

అలెగ్జా: లార్డు వేవెలు, లారెన్సు సంభాషణలు కాంగ్రెసు నాయకులకు అపార్థంబు కలిగింపకుండు గాక!

జవ్హ: మంత్రిపుంగవులారా! కాంగ్రెసు వర్కింగు కమిటీ ఆదేశంబున మీ ప్రతిపాదనలకు కొన్ని షరతులు తెల్పక తప్పదు.

గీ. భావి భారత విఖ్యాత పథకమునకు
వరుసగా మాదు సూచనల్ 'వల్లభాయి'

చేసియున్నాడు, మీ రందు వీసమైన
హెచ్చుతగ్గులు చేయగా నెంచరాదు.

పటే : దేశవిభజనకు, రాజ్యాంగసభను విడదీయుటకు కాంగ్రెసు అంగీకరించదని మరోసారి రాయబారుల జ్ఞప్తికి తెస్తున్నాను.

నెహ్రూ : యూనియన్ బలముగా నుండవలెనన్న, రాష్ట్రాలకన్న అధికారాలు మెండుగాను, రక్షణ జాస్తిగాను ఉండవలెను.

క్రిప్సు : దేశాన్ని రక్షించగల బలమున్నూ, ఇతర దేశాలతో సమాన హోదాయున్నూ, ఉండవలెనని మా ఉద్దేశంకూడా. అంతటి శక్తి ఇండియాకు కల్గేవరకు మా సైన్యాలను తీసుకుపోబోమని హామీ యివ్వ సిద్ధముగా నున్నాము. ఒడుదుడుకులు లేకుండా అధికారం హస్తగతం చేసికొన సంకల్పించు మీరు దీన్ని గుర్తించకపోరు.

నెహ్రూ : అటులనా ?

— కీర్తన —

ఏలా ! నీ విటు బల్క నేలనయా ?
చాలింపు మాటలవేల ॥ఏలా॥

మిన్నయౌ జాతిగ దలచి - పన్నుగడ లెన్నొ పన్ని
యున్న మీదు ప్లానులన్ని - సున్నయౌనుగా
తిన్న యింటివాసముల - నన్ని లెఖ్కపెట్టదలచి
సన్నద్ధంబై వచ్చి పైగ - నన్ను మభ్యపెట్ట తరమె? ॥ఏలా॥

పటే : కీలుబొమ్మల జేసి మమ్మిటు యేల దలచిన
పాలకుడ క్రిప్సేల ॥నీవిటు॥

చెప్పకుండ స్టర్లింగుల - అప్పుగా తీసుకున్న
తప్పదా ఋణమంత తీర్చ - ఎప్పటికైనా,
చప్పరించే మాటలేలా - గప్పాలు కొట్టుటయేల ?
ముప్పులేని మార్గమొకటె తప్పిదంబు ఒప్పుకొనుట ॥ఏల॥

క్రిప్సు : ఆగ్రహమేల సర్దార్ ! మన సంబంధము లీనాటివా ?

పటే ; ఆనాటి వాటిని తెగతెంపులు చేసికొనగలందులకే యీనాటి సంప్రదింపులు.



లారె : సాటి రాచకీయ పక్షంపైన లీగు నాయకులముందు మీఅభిప్రాయ ముంచుట మంచిదని మా తలంపు.

పటే : మీ తలంపేమైనను జాతికి తలవంపగు సంప్రదింపులకు అనుమతింపము. తెలిసినదా ?

నెహ్రూ : సగౌరవంగా జీవించడమే మా ఆశయమని ప్రపంచమంతకూ ఎలుగెత్తి చాటే దినాని కెదురుచూస్తూన్నాం.

క్రిప్సు : మిష్టర్ నెహ్రూ....సర్దారు మహాశయా అంతియెగాక ఆహార సంక్షోభచే భారత దేశంబు అట్టుడికిపోవుచుండ, నడివీధుల్లోనిన్న మొన్నగూడ పట్ట పగ్గాలులేక ప్రజలుచేసిన దుండగాలు, నావికుల ఫిరంగికాల్పులు సహింపనలవికావు గదా ! దీనికంతకు 'కీ' (Key) గానుండి, నడుపుచున్న 'బేక్ గ్రౌండ్' (Back - ground) యెరుంగక పోము. రాజద్రోహంబును దేశ కల్లోలంబును పురికొల్పి—

— కందార్థం —

కసిదీదగ తొలినాడే
ఉసికొల్పిరి నావికులను - ఉమ్మడి సమ్మెన్
పసజూడదలచినారుగ
అసదృశమౌ మాదుశక్తి అగుపడవలెగా
అరాజకంబు వెంటనే తొలుగా.

పాలకుల నెదిరించి నిలుచుట, కాలవాహిని కెదురుయీదుట
విలయతాండవనృత్యముల ఫలితంబులెల్లను మీకె యెదురౌ
సైరింపజాలా ! గుజరాతి సర్దార్ ! త్వరపడవేలా ?

పటే : ప్రజానీకము విచ్చలవిడిగా చేసినదౌర్జన్య హింసాకాండలకు, గూండాల చర్యలకు కాంగ్రెసుసంస్థ బాధ్యత వహింపజాలదని రాయబారులను హెచ్చరిస్తున్నాను. వంగరాష్ట్రపు నడిగడ్డపై నెత్తురుటేరులు ప్రవహించినపుడు, అహింసా తీర్మానమును కలకత్తా సమావేశంలో కాంగ్రెసు వర్కింగు కమిటీ పునరుచ్చరించుట జ్ఞప్తిలేదా ? అంతేగాక 'బొంబాయిలో నావికులు తిరుగుబాటు జరిపినప్పుడు 'కూడదు' అని ఆపుజేయించుట గుర్తుకు

రాదా? జాతీయ కాంగ్రెసును నడిపించుటకు నాయకత్వం వహించుటలో మేమెప్పుడును బాధ్యతతోనే ప్రవర్తిస్తున్నాము.

రాయబారవర్గం — కీర్తన

అడవిగాచిన వెన్నెలాయెను ఆదిలో రాజీలయత్నము
వడిగడంగుడు ఎగ్రిమెంటుకు తడబడక తర్కములు సేయక
కలసి రారండీ! కాంగ్రెసు లీగూ — మేలుదలపండీ.

అలె: ముఖ్య రాజకీయపార్టీ నాయకుల అభిమతంబెరుగుట రాయబారుల సమ్మతము. సంప్రదింపుల అనంతరమే....

నెహ్రూ: వలసదేశాల స్వాతంత్ర్యం, శాంతియుత ప్రపంచం, మా ముఖ్య ఆశయం. అఖిలభారత కాంగ్రెసు కమిటీ ఆదేశానుసారమే రాజకీయ పార్టీలతో సంప్రదింపులు.

పటే; ఏమైననూ, కాంగ్రెసు తన జాతీయత గంగపాలొనరింప సంకల్పించదు. ఇక మా షరతులకు సరియైన సమాధానము వచ్చినప్పుడే సంధికి సమ్మతం.

క్రిప్స్: ఆహ్వానించినంతనె అరుదెంచి యింత శ్రమ తీసుకున్న మీకు హృదయపూర్వక ధన్యవాదాలు.

పటే; అది కాలప్రభావం.

నెహ్రూ: ఇది అవసర సమయం (నిష్క్రమణ).

# 3 వ రంగం

సూత్ర: అని, యీ ప్రకారంబున కాంగ్రెసు కార్యవర్గపు టనుమతిని సంప్రదింపులు జరిపిన సర్దార్ పటేలు, పండిట్ నెహ్రూ మంత్రిత్రయ ప్రతిపాదనలకు స్వస్తి వాచకము చదివిన అనంతరంబు - అమాత్యత్రయంబుచే ఆహ్వానింపబడిన ముస్లింలీగు నాయకుడు క్వాయిదె అజాం మహ్మదాలీ 'జనాబ్ జిన్నా' వేవెలు భవనంబునకు ప్రవేశించు కథాక్రమం బెట్టిదనిన—

[ జిన్నా ప్రవేశం ]

ఆదితాళం - కాంభోజిరాగం

పిలువ నంపగా - వచ్చెనూ
జనాబ్ .... జిన్నా తా ॥పిలు॥
ముస్లిం ప్రజలకు మార్గదర్శి యని
పలువిధంబులను - ప్రస్తుతి బడయుచు ॥పిలు॥
లాహోర్ తీర్మానం బమలు జరుప
అఖండమౌ కృషి సల్పుచుండి తా॥
కొలువుకూటము జేరెనూ॥ జనాబ్॥

(వేవెలు ఆహ్వానించి తీసుకురాగా, మంత్రులు, జిన్నా కరస్పర్శచేసి ఉచితాసనంబులపై కూర్చుందురు)

లారె: — కందార్థం —

మేజరు 'అట్లీ' ప్రకటన
తాజాగా దెచ్చినాము తద్విషయంబున్
రోజులు గడుపక వెంటన్
ఓజిన్నా నేడె దాని యోచింపుడిటన్
ఫలితంబు మాకు వెంటనే దెలుపన్

కేంద్రరాష్ట్రపు ఎన్నికలలో, సాంద్రముగ మీ బలము నిల్పి
గెలువ ముస్లింసీట్ల నెన్నిటొ పిలువనంపితి సంప్రదింపుకు
పలుకగదయ్యా - మీకోర్కెలెల్లా - తెలుపగదయ్యా॥

జిన్నా : కాంగ్రెసుపత్రికలు ప్రచారకులు వారిఅనునాయులు 'అట్లీ' ప్రకటన తమ కనుకూలమని చంకలెగుర వేస్తున్నారు. లాహోరులో లీగు సమావేశ సందర్భమున చేయబడిన పాకిస్థాన్ తీర్మానమును చూచితిరికదా! పదికోట్ల ముస్లిముల ఆశయమైన పాకిస్థాన్ సమస్య పరిష్కారమైనప్పుడే శాశ్వత పరిష్కారసంధి. సంప్రదింపుల సఫలత. హిందూకాంగ్రెసు పెత్తనంబుకు లోబడి పరిపాలనా బాధ్యత ముస్లింలీగు స్వీకరింపజాలదు. పదికోట్ల ముస్లిం లను కూడా మైనారిటీ యనుట మహాపరాధము. కాంగ్రెసుకే అధికారమీయ సంకల్పించిన యావద్ముస్లిం జాతి ....

క్రిప్సు : మిస్టర్ జిన్నా - అంతప్రయాసయేల? మిమ్ములను వదలిపెట్టి కాంగ్రెసుతోనే రాజీచేసుకోవడం కలలోనివార్త. అయిననూ—

— కీర్తన —

అధికారం, హస్తగతంబౌ - వేళలో - వాదంబదేలా?
హిందు ముస్లిం బేధమదేలా? మీలో ॥ఈవేళలో॥
జాతులంచుతగవుల్, - నీతికెపైఁ ఉధ్యాల్
నాటిమాట నీటిమూటయా? నేటికి ॥ఈవేళ॥
రాజీబేరాల్మాని - రభసజేయుటేలా?
సఖ్యతయే సంధిమార్గము - దేశ విముక్తిమార్గము ॥ఈవేళలో
మహ్మదీయులకు మేమే - హామీయిచ్చెదము
యూనియన్లొ గ్రూపులుండును, - రాష్ట్రాల్ చేరుచుండును॥

జిన్నా : అయిన

గీ. హిందు ముస్లిం జాతులకేమి పొత్తు?
రెండు రాజ్యాంగసభ లెపుడుండవలయు
హిందుకాంగ్రెసు ముస్లిమునెన్నుకొనుట
మాముసల్మానులకు అవమాన కరము॥

అంతేగాక సింధు, పంజాబు, సరిహద్దు, బెంగాల్, అస్సాము, బెలుచిస్థాన్ రాష్ట్రములను పాకిస్థాన్ ప్రాంతముగా విభజించి మహమ్మదీయుల జన్మహక్కును గుర్తించ కోరుచున్నాను.



లారె : మీరు కోరిన ఆరురాష్ట్రాలను ప్రత్యేకంగా విడదీసి పాకిస్థాన్ రాజ్యంగా నిర్మించ వీలుపడదు. ఏలయన—

క. అలర జలంధరు డివిజను
కలియదు మీ భాగమందు కారణ మెరుగన్
పలుమరు 'తారాసింగదె'
కలహించిన కారణంబు గఘునింప దగున్.

జిన్నా : మీ రెన్ని సాకులు కల్పించినా, సిక్కుల హక్కులకు భంగం కలుగనీయమని హెచ్చరిస్తున్నాను.

వేవె : అంతే గాదు; జనాబ్!

కందార్ధం : "పడమర బెంగాల్" గాకను
విడువుడు "కలకత్త" నెల్ల వేగమె మీరల్
అడిగినచో "అస్సామును"
చెడిపోవును సంధి నేడె సిద్ధము జిన్నా
రాజ్యాంగమునకు రాజీయె సున్నా.

పాకిస్థాన్కు ఒప్పుకున్నచొ, రక్తపాతము తప్పదంచును పలుకుచున్న 'పటేలు' మాటకు - కలసి చర్చలు సల్పుటుచితము మనవిని వినుమా - జనాబ్ వేగ - పనిచేయ చనుమా॥

అలె : మైనారిటీ సంఘంబులన్నియు కాంగ్రెసు అండనున్నవని యెరింగియు, మొండిపట్టుతో 'నే పట్టిన కుందేటికి మూడేకాళ్ళన్న' మొదటికే ముప్పువాటిల్లు నేమో.

జిన్నా : 'అందినజుట్టు, అందకున్నకాళ్ళు' సిద్ధాంతము మావిద్యగాదు. ముస్లింజాతిస్వేచ్ఛకోసం రక్తపాతం జరిగినావిచారించము. పాకిస్థాన్కోసం పదికోట్ల ముస్లిముల ప్రాణాలర్పించడానికి సంసిద్ధం.

క్రిప్సు : సంధిసమయముపట్ల తుందుడుకు పనికిరాదని మీరెరుగకపోరు గదా జనాబ్!

జిన్నా : బ్రిటిష్ వస్తువులకు వ్యాపారవసతి కల్పిస్తామన్న కాంగ్రెసు మాటలు ఆశగొల్పినవికాబోలు. హిందూపెట్టుబడిదార్ల దగాకు లోబడ్డేరు. అసలు హిందువులకంటె మీవస్తువులను అధికంగా

కొనేది ముస్లింలని మరువకుడు. అంతేగాదు. మాకుస్వాతంత్రం వచ్చి, పాకిస్థాన్ ఏర్పడగానే మీకుబలవత్తరమైన మరొకమిత్ర రాజ్యం ఏర్పడుతుందికూడా

డైలాగ్ — ఆదితాళం — దేవగాంధారి రాగం

లారె : భారాత రాజ్యాంగ - స్వరూపముకనగా
యూనియన్‌లో గ్రూపు - లుండునోయనఘా॥

క్రిప్సు : రవణా మార్గాలు - రక్షణశాఖల్
విదేశాంగం సైతం - యూనియన్‌కుండూ॥

జిన్నా : శాసనసభలోను - మంత్రివర్గములో
సమాన ప్రాతినిధ్యం బీయవలయున్॥

వేవె : సమాన ప్రాతినిధ్యంబుకే తాను
ఒప్పుకోనని కాంగ్రెసు ఎప్పుడో జెప్పె॥

జిన్నా : ఆర్థిక ఆదాయ మధికార మేమీ
యూనియన్ చేతిలో వుండనేరాదు॥

అల : కష్టమ్సు, రెవిన్యూ. కరస్సీపైనా
అధికార మడిగెను ఆదిలో కాంగ్రెస్॥

జిన్నా :

ఆదితాళం - జంఝూటి రాగం

అటులయిన సంధియే - మటుమాయమైనది
కుటిలనీతితోయిటు - కిటుకు కల్పించిరీ॥
లీగుకోర్కెలన్నీ - సాగెడు వేళకే
సమ్మతింతును నే - సంధి బేరంబుకు (నిష్క్రమించును)

# 4 వ రంగం

సేవ : మంత్రిత్రయంబుతో ముచ్చటించుటకు కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి పి. సి. జోషీ వచ్చుచున్నాడని వార్త వచ్చింది.

అలె : గీ.అల్లకల్లోల వార్తల నల్లుచుండి
సమ్మె లన్నిటి వారలే సల్పుచుండ్రి
విప్లవములకు వారిదే విత్తనంబు
పిలువనంపుట జూడ దుష్ఫలితములకె.

క్రిప్సు : కాంగ్రెసు లీగు నాయకులనే పల్టీగొట్టిన నాకు వీళ్ళ సంగతి ఒక లెఖ్ఖా !

లారె : అయినా అజాగ్రత్త, ఏమరుపాటు కూడదు. విప్లవకారుల నొక కంటకనిపెట్టి వుండడం మంచిది.

క్రిప్సు : 'పిల్లకాకికేందెల్సు ఉండేలుదెబ్బ' అని నిన్న మొన్న కళ్లుతెరిచిన జోషీకేందెల్సు బ్రిటిష్ మంత్రుల తడాఖా! ఎలా బోల్తాకొడతానో చూస్తారుగా!

[ జోషీ ప్రవేశం ]

( ఆదితాళం - సావేరీరాగం )

కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి - కార్యవాది జోషీ
భారత బానిస - బంధవిముక్తికి
పరప్రభుత్వమును - పారద్రోలుటకు
బయలుదేరెజోషీ - పూర్ణచంద్రజోషీ.

(మంత్రుల కరస్పర్శ అనంతరము, వేవెలు కుర్చీ చూపగా జోషీ కూర్చుండును.)

క్రిప్సు : బ్రిటన్ లోని అట్లీ నాయకత్వంబున నడుపబడుచున్న లేబరు ప్రభుత్వము భారత సమస్య పరిష్కరింప దలచింది. అందుకు మీఅభిప్రాయం, కామ్రేడ్?

జోషీ : ప్రధాన రాజకీయపార్టీలమధ్య భేదాభిప్రాయాలున్నవన్న సాకులు మానాలి. స్వాతంత్ర్య ప్రకటన అనంతరమే సంప్రదింపులు తిరిగి

సాగించాలి. అంతేగాక ఆరునెల ల్లోగా తెల్లసైన్యాలకు చెల్లు చీటీ యిస్తూ వెంటనే ప్రజాప్రభుత్వానికి అధికారం అప్పగించాలి—

లారె: అధికార మెవరికీయవలయునో బోధపడుటలేదు. ఏలనన—

— కీర్తన - డైలాగ్ —

బెబ్బులియు, సింహంబు - పోరు సల్పెడి రీతి
లీగు, కాంగ్రెసు రెండూ - ఢీకొనుచుండె॥

జోషి: కాంగ్రెసు, లీగులకు - కలహంబులను పెంచి
దేశసౌభాగ్యంబును - దోచుకొనుట!సాగదూ॥ ఇంకాసాగదూ॥

క్రిప్స్: ఇరుపక్షముల వారికి - సింహస్వప్నమె మీరు
మీ సలహా పాటించరూ - కామ్రేడ్ జోషి వినమూ॥

జోషి: పీడించే పాలకవర్గాలపై కార్మిక కర్షక విప్లవ జ్యోతులు సన్నద్ధమౌతున్నాయని గుర్తించాలి.

క్రిప్స్: గుర్తించడానికేం గాని- కాంగ్రెసు అఖండ భారతవర్షం కోసం, లీగు పాకిస్థాన్ కోసం పట్టుబడుతున్నాయి. మీరే పక్షాన్ని బలపరుస్తారు కామ్రేడ్!

జోషి: ఆ రెండు సంస్థల్లోని న్యాయాన్ని మాత్రమే బలపరుస్తాం. భారతదేశంలో వివిధజాతుల స్వాతంత్ర్య హక్కు, పరిపాలనా విధానం ప్రజలే నిర్ణయించుకుంటారు. అధికారం భారతీయుల పరం చేసి ముందు మీరు మూటా ముల్లె కట్టండి.

క్రిప్స్: అధికారం భారతీయుల పరం చేస్తామని ఎన్నడో ప్రకటించాం. (పైకిచూస్తూ, బుర్రగోక్కుంటూ, ఆలోచిస్తున్నట్లు నటిస్తాడు)

జోషి; నేతిబీరలో నెయ్యి, బ్రిటన్ ప్రకటనలోని సత్యం - సర్వం శూన్యం.

గీ. కీలు గుఱ్ఱాలనెక్కించి తోలమనుట
చెవినియూయక తాళంబు చెంతనిడుట
మాయకుచ్చులబొంతచే మూయచనుట
చెల్లవిక మీదునాటకాలెల్ల యిచట (నిష్క్రమణ)



అలె: అనుకున్నంతా జరిగింది. అదురుదు పిండం!

లారె: దీనికేంగాని, సంస్థానాలవిషయం జాగ్రత్త వహించాలి. ప్రతి సంస్థానంలో అల్ల కల్లోలాలు అంతులేకుండా జరుగు తున్నాయి.

క్రిప్స్: సంస్థాధీశ్వరులు, వారి మంత్రులు పాలక వర్గంచాలరూ. అవసరమైతే బ్రిటిష్ సైన్యాలు తయార్.

# 5వ రంగం

సూత్ర : అని యీ ప్రకారంబున మంత్రిత్రయంబు గప్పాలుగొట్టిన యనంతరంబు, సామ్రాజ్యరక్షణా భారంబు దీక్షతో మోయువారి ప్రతినిధియూ, బహుకోటి పీడితజన రక్తమాంసాది భక్షకుండును, నరేంద్రమండలికధ్యక్షుండును అగు భోపాల్ నవాబు ఏలినవారి దర్బారున ప్రవేశించు కథాక్రమం బెట్టిదనిన—

[ ప్రవేశం - భోపాల్ నవాబు ]

అటతాళం — అఠాణా రాగం

నిండు కొలువైయున్నాడె, నిఖిల కీర్తిగన్నాడె
భూపాలకుల మకుటమే - భోపాల్ నవాబ్॥

సేవ : అనర్ఘమణి రమణీయ, కిరీటకుండలాంగద గ్రైవేయాది వివిధ భూషణ భూషితా - బహుపరాక్.

ఆదితాళం - దేవగాంధారి రాగం

భోపా : కొలువైయున్నాడె దీక్షతో, భోపాల్ ॥కొలు॥
రాజమకుట నవరత్న విరాజిత
పూజిత పాదాంభోజ తేజుడు ॥కొలువై॥

[ రాయబారులు ప్రవేశిస్తారు ]

భోపా : సంస్థాన స్వాతంత్ర్యదాతా ! రాజ్యాంగ కార్యదర్శీ బహుపరాక్.

లారె : సెహబాష్.

భోపా : సకల ప్రజానీక మనోభయంకరా ! రాయబార సంజయా ! క్రిప్స్ మహాశయా ! పరాక్ !

క్రిప్స్ : బలేభేష్.

భోపా ; అభయహస్త దాయకా ! నౌకానాయకా ! బహుపరాక్.

అలె : మాంచిది.

భోపా : సామ్రాజ్య సార్వభౌములు, ఘనతవహించిన ఆంగ్లప్రభువులు నగు ఆరవ జార్జి చక్రవర్తిగారి రాయబారవర్గమును కలసుకున్నందులకు అమందానంద కందళిత హృదయారవిందుండనైతిని.

( భోపాల్ నృత్యం - దశావతారానుసరణ )

త్రిపుటతాళం

తగ్గధింత ; తాహతధీనుత
తద్ధీనుత ; ధానుధణాంధిమి
తఝంతరిత ; తఝంఝంతరిత
తఝంతరిత ; ఝంతకురేకిణ
తదికుడిడుకు ; డిడిడికు, ధింకుకు
తక్కిణనక ; తకుంధరికిణనక
తకుంద, దికుంద ; దికుందరి, తకుందక
మత్సరమున - తుచ్ఛప్రజలే
జొచ్చియు - జలియన్‌వాలాలో
విచ్చలవిడి - జొచ్చిఎదిర్పగ
ఠాం ఠాం ఠాం - ఠామ్మనిప్రేల్చియు
ఇచ్చరిగద - వీరస్వర్గము
మెచ్చగ మిము వరహావతారా॥

తఝ్ఝణుత ; తగ్గదితకుందది
గ్వాలియరులో - కాల్పులుకాల్చియు
బొంబాయిలో - రక్తపుటేరుకు
నావికులపై - టాంకులునడిపిన
పలుమరునిను - ప్రస్తుతింతునిదె
కలిమిబలిమి - ఎలమినొసంగుదు
కులగిరియౌ మేరువరూపా॥

తకుం తరిత ; కుం తకి రే కిణ
భంగపరచి - ప్రభువుల వ్రతముల్
చెంగున కాశ్మీరము - దూకిన
పండిట్ జహ్వారు - బంధింపగ
పంపితివే అజ్ఞల - చిటుకులో
దాసుడనిదె దానవరూపా॥

తకాంకు, తకధిమి - తక తధి కిణ తోం॥

లారె : మహారాజా! చక్రవర్తిగారి తరపున వారి అభివందనములు తమ కందజేస్తున్నాము. ఘనత వహించిన చక్రవర్తిగారి ప్రభుత్వము భారతదేశమునకు సరికొత్త రాజ్యాంగాన్ని ప్రసాదింప దలచింది.

భోపా : సంస్థానాధిపతులకు, సార్వభౌమ ప్రభుత్వ మిచ్చిన హామీలు ఒడంబడికలకు ఏ మాత్రం అంతరాయం రానీయవలదని ఏలిన వారి ప్రతినిధులకు మనవిచేయుచున్నాను. అట్లయిన మీరే రాజ్యాంగాన్ని ప్రసాదించినా మాకు సుంతయేని అభ్యంతర ముండదు.

క్రిప్స్ : మహారాజా! సంస్థానంబులలో అల్లకల్లోలంబులు, అరాజకంబులు రాకుండ మా బ్రిటిష్‌సైన్యం 'కంటికి రెప్పవోలె' కాపాడుచున్నది. అందుకు సంస్థానాధీశ్వరులు, ఘనత వహించిన చక్రవర్తిగారి ప్రభుత్వంబునకు యధారీతిని కృతజ్ఞులై యుందురని విశ్వసించుచున్నాడను.

భోపా: పదేపదే హెచ్చరించనేల మహాశయా! 'నీవునేర్పిన విద్యయే నీరజాక్ష' అన్నట్లు పుట్టినతావున, మెట్టిన చోటున యేలినవారి కృపాకటాక్ష వీక్షణముచే ఇంతవరకు ఏలోటులేదు. అయిననూ, కుక్కకు విశ్వాసము, నక్కకు వినయమూ నేర్పవలెనా సామీ! ఆపత్కాలంబులో బ్రిటిష్ ప్రభుత్వానికి మాధన, ప్రాణసర్వస్వాలర్పించాం. అర్పిస్తున్నాం. అర్పిస్తాంకూడ. ప్రభుభక్తినిగుర్తించుట ప్రజాశక్తుల కూలద్రోయుట ఉగ్గుపాలతో రంగరించిన విద్యలు. ఘనత వహించిన మంత్రిత్రయము దేవదత్తమైన మాహక్కులకు ఏలోటూ రాకుండా చేయాలని మాకోర్కె.

అలె : యుద్ధానంతర కాలప్రవాహంబున కొట్టుకొని పోకుండా చూడవలెనన్న, క్షణక్షణమున ప్రతిసంస్థానములో చెలరేగుచున్న విప్లవాగ్నుల నణచుటకు సంస్థానాధీశులంతా ఏకం కావాలి. పాకిస్థాన్, హిందూస్థాన్‌లమధ్య నలిగిపోకుండా పకడ్ బంద్ చేయాలి.

భోపా : చిత్తము. దేవర ఆజ్ఞానుసారమే వర్తించెదము.

క్రిప్స్ : మహారాజా! (సంజ్ఞతో దగ్గరకు రప్పించి) మహోపద్రవం



మరోటి రానున్నది. అంతా కలసి ఎదిరించకపోతే మంది, మార్బలం, రాజులు, మహారాజులు, చక్రవర్తులు. మిమ్ముల పాలించే ప్రభువులతోసహా నాశనం. సర్వ నాశనం, కనుక సంస్థానాల్లో....

గీ. విప్లవాగ్నులు చెలగుచో విఫలమంద
బొల్షివిక్కులెవచ్చిన పోరుసలుప
నౌక, సైనిక కేంద్రాలె కాకయచట
అలవికాని విమానాశ్రయములు వలయు.

అయిననూ, కాంగ్రెసు, లీగు; సంస్థాన ప్రజలు సమిష్టి పోరాటం జరుపుదురన్న భయం....

భోపా : అదొకలెఖ్ఖా. తమవంతు వ్యూహంపన్నండి. మా సర్వశక్తులు వినియోగిస్తాం - అయినా.

కందార్థం. ఇంతింత మాత్రమునకే
చింతిలగానేలనీవు చిన బాబయ్యా
మంతనములు సాగగమా
వంతులు నెరవేర్తుమింక పంతంబుతోడన్
మీకోర్కె లెల్ల సాంతంబుదీరన్,

మాళవ, నేపాళ, మగధ, చోళ కాశ్మీర మరాట
మైసూరు, తిరువాన్కూరు, నైజాం, గ్వాలియరు భూపతుల-నందర
పిలువనంపెదనూ - సన్నాహముతో — కొలువుకూటముకూ॥

(నిష్క్రమణ)

అలె : తలచింది తలక్రిందుకాకుండా చూడా[illegible] చక్రంలోనున్న బ్రిటిషు ఇరుసుకు తుప్పుపట్టకుండా చూడాలి. సోవియట్ సైన్యవిన్యాసం, అమెరికా అటంబాంబు అట్టహాసంతోనే అధఃటు పుడుతోంది. "మూల్గేనక్కపై తాడిపండుపడిన"ట్లు భారత రాజకీయ పక్షాల సమిష్టిపోరాటాలు కల్సివస్తే కొంపలారిపోతాయి.

లారె : సమయానుకూలంగా శత్రువుతోమైత్రి నెరపి సామ్రాజ్యాన్నిసంరక్షించుకోవాలి. కావున పలుకుబడి బలంవుండి ప్రమాదంలేని ప్రధానపార్టీని ప్రభుత్వంలో ఇరికించే ప్రయత్నం చేయాలి.

క్రిప్సు : అందుచేతనే తాత్కాలికప్రభుత్వ యంత్రంలో కాంగ్రెసును దించ తుదిప్రయత్నం.

అలె : కాంగ్రెసుకే కేంద్రంలోఅధికారం హస్తగతంచేసిన,జిన్నా నాయకత్వాన ముస్లింలీగు ప్రతిఘటించి తీరుతుంది. ఆకలితీరకపోగా 'తోకతెగిన నక్క'సామెతౌతుంది మనవ్యవహారం.

క్రిప్సు : అదిపొరబాటు. వేసినఎత్తు ఎదురవడమే ? *Mr.* లారెన్సు. లెఖ్కవేసి పక్కాప్లాను వేశామన్నమాటే ఇంకజిన్నా—

— కీర్తన - డైలాగ్ —

హిందువులతో పోరుసల్ప
ముస్లిముల నెల్ల యుసికొల్పి
గొట్టి తనబలముతో - కొండనే ఢీకొన్న
చందాన జిన్నాయు - సల్పు చర్యల నెన్నొ॥

లారె : కీచులాడకపోరు వారు
పాచికల్ నెరవేరి తీరు
శాశ్వతంబుగ భారతావనిన్ బంధించి
హాయిగా సుఖియింప - అదును దొరికెను నేడు॥

కాగల పని గంధర్వులే తీరుస్తారు. గత్యంతరం లేని జిన్నా ప్రభుత్వ బోనులో ప్రవేశిస్తాడు.

క్రిప్సు. బోనులో సింహాలు, చేతిలో కొరడాలు, ఇరుపార్టీలను ఇరికించి సామ్రాజ్యంలో సర్కస్ సాగిస్తాం. ప్రజా విప్లవాలను పల్టీ గొట్టిస్తాం.

అలె ; అతిరధులు మహారధులు మనలో వుండుటచేతనే బ్రిటిష్ సామ్రాజ్యంబున - రవి అస్తమించదని సార్థకమగుచున్నది. ఛేంబర్లేన్ గొడుగుకు. చర్చిలు చుట్టకూ, లారెన్సు చంకబైబిలుకూ.....

క్రిప్సు : (అందుకొని) అలగ్జాండరు పొట్టకూ....



అలె ; క్రిప్సు పైపుకూ పొత్తు కుదురుటచేతనే వేసిన ఎత్తేదీ చిత్తవ్వకుండా మొత్తంగా నెగ్గుతోంది.

క్రిప్సు : మన పాచికలు నెరవేరకనూ పోవు, భారత దాస్యం శాశ్వతంగా బ్రిటిష్ సామ్రాజ్యం స్థిరస్థాయిగా వుండకపోవు.
హిప్ హిప్ టు ది బ్రిటిష్ ఎంపైర్. హిప్ హిప్ హుర్రే.....

(మంత్రులు ముగ్గురు డ్యాన్సుచేస్తూ పోతారు)

[ ఇంగ్లీష్ ట్యూన్ ]

— కీర్తన —

రాయబారులం - రానెవచ్చితిం
ఎత్తువేసితిం కొత్త ప్లానుగీసితిం.
పంజరంబులోన ఒక్క చిలుక నుంచుదాం
బైటనొక్క చిలుకనుంచి పాట్లుపెట్టుదాం
హాయి హాయిగా - ఇంగ్లండు జేరుదాం (నిష్క్రమణ)

సూత్ర : అని యీ ప్రకారంబున బ్రిటిష్ సామ్రాజ్యంబును సంరక్షింప కపటనాటక మాడిన రాయబారవర్గం 'లండను' నగరంబు జేరె. మంతనంబుల ప్రతిఫలంబుగ యిట భారతదేశంబున, హిందూ ముస్లింలు రెచ్చిపోగా కలహములు పెచ్చుపెరిగి విచ్చలవిడి హత్యాకాండలు కొనసాగె.

అట్టితరి స్వాతంత్ర్యంబుకు ప్రధమ సోపానంబని యెంచి కాంగ్రెసు అగ్రనాయకులు తాత్కాలిక కేంద్ర ప్రభుత్వంబున ప్రవేశించిరి.

మితిమీరిన హిందూ ముస్లిం కలహంబుల ఫలింబుగ రక్తంబు కాల్వలై ప్రవహించె. వేలాదివేల శవంబులతో కలకత్తా, బొంబాయి మొదలగు ముఖ్యనగరంబులు కళలుదప్పి శ్మశానవాటికలుగా మారి నిర్జీవంబులై నిలచిన తదుపరి కధాక్రమం బెట్టిదనిన—

[ సూత్రధారుల్లో - ఒకరువిలపిస్తూ ]

— కీర్తన —

ఎంత మోసమూ - జేసిపోయిరీ
రాయబారులూ చోరులై ఎంత ॥నేడెంత॥

( రెండవ సూత్ర )

నిరాశ పడనేలా, విప్లవ
జ్యోతుల కనవేలా?
స్వతంత్ర శంఖంబును పూరించి
చలోచలో నడువూ

( తెరలో పాట )

మదిని దిగులుపడ పనిలేదింకా
మన ఐక్యతఢంకా
మ్రోగెను ఆ వంకా ॥చలో॥

వ॥ (పిలుపు నందుకుని పీడిత భారత ప్రజానీకం తండోపతండాలుగా స్వతంత్ర పోరాటంలో ముందడుగేస్తారు.)

— కీర్తన —

భారత జయభేరి మ్రోగెనదె
దాస్యశృంఖలాల్ తెగత్రెంచన్
లేవోయీ - నిదురలేవోయీ
ఫ్రాన్సు, యుగొస్లావ్ - ఇటలీ చైనాలో
ఢమఢ్మ మ్రోగినది ప్రజల ఢంకా
రావో హిందూ భాయీ - రావో ముస్లిం భాయీ
దీక్షతో కార్మిక కర్షకులంతా
మత్తశతృగజ పీచమడంచు ॥భారత॥

[ సమాప్తం ]



# చదవండి

## మద్రాసు మంత్రివర్గమా ఎక్కడికి?

మద్రాసులో ప్రజామంత్రివర్గంవుంది. కాని ప్రజామంత్రివర్గం వెనుకనుండి సామ్రాజ్యవాదులు ఆడేనాటకం గమనించకుండా ఎటువంటి మార్గాన్ని అది అవలంబించుతున్నది తెలుసుకోండి. వెల : రెండణాలు

## ప్రకాశంగారి వస్త్రవిధానం అమలుజరిగితే—

రచయిత : పుత్సల సత్యనారాయణ

కూటికేగాకుండా గుడ్డకుగూడా ముఖంవాచి, ప్రజలు అర్ధదిగంబరులై అలమటిస్తోంటే, యుక్తాయుక్తవిచక్షణ లేకుండా మనరాష్ట్రం నెత్తిన రుద్దబడిన ప్రకాశం మంత్రివర్గవస్త్రవిధానంగురించి, రాష్ట్ర చేనేత పారిశ్రామిక సంఘాధ్యక్షులు వ్రాసినపుస్తకం. పావులా

## హైద్రాబాదు రాజ్యాంగ సంస్కరణలు; కార్మికవర్గం

రచయిత: డాక్టర్ రాజ బహద్దర్‌గౌడ్

నైజాం ప్రభుత్వ ఛత్రచ్ఛాయల క్రింద పెట్టుబడిదారులు కార్మికవర్గాన్ని ఎలా దోచుకుంటున్నారు? కార్మికులు యీ దోపిడీని ఎదుర్కొంటూ ఎటువంటి పోరాటాలు చేస్తున్నారు? కొత్తగా ప్రవేశపెడుతూన్న బూటకపు సంస్కరణలు పెట్టుబడిదారీ విధానానికి ఎటువంటి రక్షణలిస్తాయి. ఈ ప్రశ్నలకు సమాధానం ఈపుస్తకంలో చదవండి. వెల: రెండణాలు

## నైజాం రాజ్యంలో ప్రజావుద్యమంపై ప్రభుత్వదాడి

నిజాం ఆంధ్రప్రజలను దేశముఖులు పెట్టే దారుణ హింసలూ, ఈదుర్మార్గులకు నైజాం నవాబుయిచ్చే ప్రోత్సాహమూ, ఆంధ్రమహాసభ నాయకులు దేవులపల్లి వెంకటేశ్వరరావుగారు కళ్ళకు కట్టినట్లు యీ పుస్తకంలో చిత్రించారు. కోటిమందిగల ఆంధ్రుల నెదుర్కొంటూన్న యీ భీషణ సమస్యను, ప్రతిఆంధ్రుడూ చదివి తెలుసుకోవాలి. వెల: అర్ధణా

